# ఎరుకలలచ్చిమి

## గేయ సంపుటి



ఎరుకల లచ్చిమి

ఎత్తండి జెండా

నాయకుడు పంద్రంగి

తెలుగునాటి శునకం

పోస్టు జవాబ్



కొప్పరపు సుబ్బారావు



# ఎరుకల లచ్చిమి ★★★

( తెలంగాణా దురంతాల్లో ఒక ఘట్టం )

ఈ సంపుటిలో

ఎరుకల లచ్చిమి
ఎత్తండి జెండా
నాయకుడు పండ్రంగి
తెలుగు నాటి శునకం
పోస్టు జవాన్

## రచయితయొక్క ఇతరములు

- రోషనారా
- నూర్జహాన్
- నేటి వటుడు వగైరా
- తారా శశాంకం
- శాస్త్ర దాన్యం

ది మోడరన్ పబ్లిషర్సు : తెనాలి.

# ఎరుకల లచ్చిమి

(గేయసంపుటి)

రచయిత:

కొప్పరపు సుబ్బారావు

ప్రకాశకులు:

ది మోడరన్ పబ్లిషర్స్:

తెనాలి.

# తొలి పలుకు

ధనవంతుడికి ఆదాయపు పన్నుతోనూ, దరిద్రుడికి ఆకలిమంట తోనూ, మధ్యతరగతికి కుటుంబ జంబాలంతోనూ, ఉబుసు పోని క్షణం ఒక్కటైనా కనిపించడం లేదు.

కరువు వచ్చింది. చీకటిబజార్లు పెంపొందాయి. జీవితావసరాలకు కావలసిన ముఖ్య పదార్థాలన్నీ-బ్లాక్‌మార్కెట్టులోకి అదృశ్యమైనాయి 'ఉబుసుపోకపోవడం' అనబడే అత్యవసర పదార్థంకూడా అదృశ్యమైంది!

ఏమీ ఉబుసు పోకపోతే ఎవరి గోళ్లను వారు గిల్లుకుంటూ కూర్చుంటారు. ఇది అనాగరకలక్షణం, అసభ్యవ్యవహారం అని అంటారు కొందరు దీనికి, రచయితలందరి తరఫునా మా అసమ్మతిని తీవ్రంగా ప్రకటిస్తున్నాం.

'ఉబుసు పోకపోవడం' రచయితల సర్వదుంబాలా యీనాం! 'గోళ్లు కొరుక్కుంటూ కూర్చోవడం' రచయితల జన్మహక్కు! లేకపోతే, గాలిని ఎలాపోగుచేస్తాడు? ఆ గాలితో దారాల్ని ఎలా పేన్తాడు? ఆ దారాల్ని పడుగు పేకలుగా ఎలా సవరిస్తాడు? అందాల చాపులు ఎలా తయారవుతయ్?

తన 'ఉబుసుపోక' హక్కును ఈ రచయిత దుర్వినియోగం చేయలేదనే విషయాన్ని, పాఠకులు అంగీకరిస్తారని విశ్వసిస్తున్నాను.

బెజవాడ
15—8—47

కొప్పరపు సుబ్బారావు

## సూచిక


| | పుట |
|---|---|
| ఎరుకల లచ్చిమి | 11 |
| ఎత్తండి జెండా | 33 |
| నాయకుడు పంద్రంగి | 35 |
| తెలుగునాటి శునకం | 42 |
| పోస్టు జవాబ్ | 45 |



తెలంగాణాలో

దశదిశల్లా

ధగ ధగలు నింపుతున్న

విప్లవ జ్యోతికి ...

అంజలి



# కథయొక్క కథ :

వందలకొద్దీ కాందిశీకులు నైజాంనుంచి మా బెజవాడకు వచ్చారు. వాళ్లల్లో ఒక ఎరుకలవాడు బెజవాడలో రిక్షాలాగుతూ పొట్ట పోసుకుంటు న్నాడు. ఒకరాత్రి వాని రిక్షాలో ఎక్కడం సంభవించింది నాకు.

ఎక్కింది మొదలు ఆ రిక్షా నన్ను ఎత్తికుదెయ్యడం మొదలుపెట్టింది. ఒక చక్రం ఎగుడు - ఒక చక్రం దిగుడు. భరించడం కష్టమైంది. 'అబ్బా! వెధవ రిక్షా నీవూనూ!' అన్నా.

ఆగకుండా అలాగే పోతూవుంది రిక్షా. కోపం వచ్చింది నాకు.

తెర కొంతసేపటికీ లేవనప్పుడు నాటకహాల్లో ఆ దురదృష్ట ప్రేక్ష కులు తమ కుర్చీలను ఏంచేస్తారో అలాగే తన్నులూ గుద్దులూ మోచేతి కుమ్ములూ ఆ రిక్షామీద కురిపించా.

నా ధాటీ పనిచేసింది. రోడ్డు పక్కగా రిక్షా ఆగింది. చెమట తుడుచుకుంటూ వాడూ నాకేసి తిరిగి, చురచురా చూశాడు. కాని, నా మొహం ఎందుకో వాడికి నవ్వు పుట్టించింది.

"దొరా! ఈ రేగిసెట్టు సూసినవ్?"

ఆ రోడ్డుమీద రోజుకు ఇరవై సార్లయినా పోతూవస్తూ వుంటాను. కాని ఆ రేగిచెట్టును ఎన్నడూ గమనించలేదు

"దొరా! ఇలాంటి రేగుసెట్టుకిందే మా దేశంలో వొక కత జరిగింది. సెప్తాగాని యింటవ్?"

అవి రంజాన్ పండుగదినాలు మా మునిసిపల్ మార్కెట్టుమీద వున్న సైరన్, తెల్లవారు జామున నాలుగింటకే కూస్తూవుంటుంది. ఆ కూత వినబడింది. అప్పటికి ముగిసింది ఆ కథా శ్రవణం.

నన్ను ఇంటికి చేర్చాడు. ఈ గేయం ముగించేదాకా నిద్రపట్టలేదు.

12—8—47
బెజవాడ

కొప్పగపు సుబ్బారావు



వినరయ్యా ! ఓ తె లు గు తండ్రుల్లార !

వినరమ్మా ! ఓ తె లు గు తల్లుల్లార !

వింత వింతా కథ

వీరలచ్చిమి కథ

తలుచుకుంటే వొళ్లు

జలదరించే కథ

మన తెలంగాణలో తెలుగువీరుల కథ !



# ఎరుకల లచ్చిమి ★ ★ ★

( తెలంగాణా దురంతాల్లో ఒక ఘట్టం )

రెక్కలు వెనక్కి విరిచారు
రేగిచెట్టుకే కట్టారు
చఢీల్ చఢీల్మన కొరడాదెబ్బలు
కొడుతూ గూండా లరిచారు

"బోలో రండీ ! బోలో జల్దీ !
పోలిగాణ్ణి యెక్కడ దాచావు ?
నిజంచెప్పితే నిన్ను విడుస్తాం
లేదా ఈ చెట్టుకు బలియిస్తాం ! "



ఇరవై రెండేళ్ల పడుచు లచ్చిమి
ఎరుకలనాగులు కుమార్తె లచ్చిమి
భూలోక మహాసుందరి లచ్చిమి
పోలిగాడి హృదయేశ్వరి లచ్చిమి

"బోలో రండి ! బోలో జల్దీ !
పోలిగాణ్ణి యెక్కడ దాచావు ?
నిజం చెప్పితే నిన్ను విడుస్తాం
లేదా యీ చెట్టుకు బలియిస్తాం"

తాగే తాగే నీరును విడిచి
తరలిపోవాలి బెబ్బులులైనా !
పోలిగాడి పేరు చెప్పితే చాల్
భూతధాత్రి కంపిస్తుంది

విష్ణుచక్ర మొకవేళ తప్పినా
తప్పదుగురి పోలిగాడి బరిసె !
విడుచుగాక యముడే గూండాలను
విడువదుసుమి పోలిగాడి కత్తి !

పగటివేళ యెక్కడ ఉంటాడో
పరమాత్మకు లచ్చిమికీ యెరుక !
ఎప్పుడు వస్తాడో నిశీథమున
ఎక్కడి గూండా కక్కడె గోరీ !

దోపిళ్లేనా దొమ్మీలేనా
దాడులు గృహదహనాలేనా !
పాపల వృద్ధుల నరుకుటయేనా
పడుచులను బలాత్కరించుటేనా !
కటికికసాయీ గూండామూకల
ఘాతుకచర్యల కెదురెవరు ?
భూతధాత్రి కంపింపగజేసే
పోలిగాడు ఒక్కడు దక్క ?

ఇరవై యొక్కరు ఏకలవ్యులన
ఇరవై యొక్కరు ఎరుకనాయకులు
ఇరవై యొక్కటి విల్లంబులతో
ఇరవై యొక్కటి బాకులతో

‘హర్ హర్’ నాదభయంకరధ్వనులు
అంబరవీథులు చిల్లులుపడగా
ఎప్పుడువస్తుందో నిశీథమున
ఎరుకల పోలయ్యా మురా !
ఎక్కడబద్మాష్ అక్కడె హరహర !
ఎక్కడిగూండా కక్కడె గోరీ !

“పోలిగాణ్ణి పట్టియిచ్చువారికి
నాలుగువందల రూకలు బహుమతి”
అంటూ పల్లెల వాడల పురముల
చాటింపించెను సర్కారు

నాలుగువందల రూకలకోసం
పోలిగాణ్ణి పట్టియిచ్చు అధముడు
మచ్చుకైన కానగరాడాయెను
మా న్వతెలంగాణములో

ఐననేమి ? ... ...
ఔరా ! సృష్టితరు !

తెల్లని వెలుగుల నల్లని నీడలు !
కడలి కడుపులోపల బడబాగ్ని !

చల్లనివానలు కురిసే మబ్బులు
సస్యసమృద్ధిని కూర్చే మబ్బులు
పెళపెళార్భటుల పిడుగులు కురియవె !

ప్రజాసేవకులు పుట్టిన నేలను
ప్రజామారకులు పుట్టుచునుందురు;
వీరులు ధీరులు పుట్టినగడ్డను
పిరికిపందలును పుట్టుచు నుందురు

భూలోకమహాసుందరి లచ్మిని
మోహించి విఫలుడైన జాగీర్దార్
ఉన్నాడొక్కడు ఉర్వీభరముగ
వానిపేరు ?— ఛీ ! మహాపాతకుడు !

అధికారమదజ్వర పీడితుడు
ఐశ్వర్యపుకైపున కన్నుగానడు
ప్రజలరక్తమును పీల్చి బలిశాడు

ప్రతిమానవతిని సిగ్గుతీశాడు
వానిపేరు?– ఛీ! ద్విపాదపశువు!

రమ్మంటేచాల్ గడగడవణకుచు
రమణులు మానము లర్పించాలి!
తెమ్మంటేచాల్ అంజలిఘటించి
పౌరులు సర్వస్వము నివ్వాలి!

"ఎరుకలదానికి ఇంతగర్వమా?
హీనకులమునకు ఇంతకావరమ?
జాగీర్దారును ధిక్కరించుటా!
జగత్తు మరిచిందా నాధాటీను?"

పామువోలె పగపట్టాడు
పరమతుచ్ఛుడా జాగీరుద్దారు

ఆ లచ్చిమిని సాధించుట కోసం
లచ్చిమ్మప్రియుని సాధించుట కోసం
నాలుగు వందల రూకల కోసం
నైజాం సర్కారు మెప్పుకోసం



ఆత్మజాతిమత సంఘ శ్రేయము
న్యాయము ధర్మము మానవత్వము
విస్మరించి, నలుగురు గూండాలను
వెంటబెట్టుకొని బయలు దేరాడు

ఊరుపక్కనే వున్నది గూడెం
లచ్చిమి వుండే యెరుకల గూడెం

గోగుపూలతో కొప్పు ముడిచింది
సోగకనుల కాటుక దిద్దింది
పాలపూసపేరులు దాల్చింది
ఫాలమున బొట్టు సవరించింది
ప్రియుని కోసమై సంకటి బువ్వను
వెదురుబుట్టలో మూట కట్టింది
బయలుదేరింది యెరుకల లచ్చిమి
ప్రియుడుండే ఆ దూరపు కొండకు!

రాబోయే కీడుల క్రీనీడలు
కాబోయే చర్యల చెడుజాడలు

సూచించే అపశకునము లుండుట
సత్యము! లేక అసత్యంబో!

గడపదాటి అడుగిడెనో లేదో!
గుడిసె ప్రక్క వుండే ఒక ముసిలి, పు
టుక్కున తుమ్మగ ఆలించింది!
గూటిలోని గువ్వపిట్టలో యన
గుండెలు గుబగుబ లాడాయి
మెండుగ చెమటలు పోశాయి
వడవడ వణికే చేతివ్రేళ్ళతో
పైటచాటు తాళిబొట్టు నొకపరి
పైకితీసి కళ్ళ కద్దుకొంది

ఇంతలోన...... ఔరా! దారుణవిధి!
ఎరుకలగూడెము ఎనిమిది దిక్కులు
ప్రతిధ్వనించెను కేకలతో
"లచ్చిమి యెక్కడ? పకడో! పకడో!
లచ్చిమి యెక్కడ? మారో! మారో!"

భీకర భాభా నినాదములతో
వేటకుక్కలే తరుముకురాగా
లంఘించే ఆ లేడిపిల్లవలె
లచ్చిమి పరుగెత్తింది

"లచ్చిమి యెక్కడ? పకడో! పకడో!
లచ్చిమి యెక్కడ? మారో! మారో!"

ముందు లచ్చి, వెనకనె ఆ గూండాల్
ముందు మయూరము, వెనక కిరాతులు
ముందు పూరెమ్మ, వెనక సుడిగాలి
ముందు కరుణ, వెనకనె భీభత్సము!

జరుగనున్న ఆ ఘాతుక చర్యను
దురిత దారుణ ప్రచండ చర్యను
చూడ నిచ్చగింపక కాబోలును
సూర్యదేవు డస్తమించె రయమున!

తన నరసంతాన పశుత్వము గని
ధరణియెల్ల సిగ్గు జెందునో యని

ప్రకృతి, విశ్వ నాటక రంగముపై
పరచె కటికి చీకట్ల తెర !

ఎక్కడ గూండా లెక్కడ యాదుది !
ఎంతసేపు ఆ పందెము పరుగు ?

గూండాల్ నలుగురు, జాగీర్దారూ,
గుడ్డలు కుక్కిరి లచ్మి నోటిలో
గట్టిగ కట్టిరి కరచరణమ్ములు
గుట్టుగ మోసిరి జాగీర్ కోటకు

గూండాలను గుమ్మముకడ నిలిపి
"ఒక్కగడియ నే నేకాంతముగా
లచ్మిని న్యాయవిచారణ చేస్తా
ఇక్కడె వుండండి మీ" రటంచును
ఈడ్చుకుపోయె హవేలికి లచ్మిని

అనంత కాలపు టాయుష్యములో
అంతరించె పదిగడియల కాలము
ఆ పది గడియలు లచ్చిమి పాలికి
పది దీర్ఘ యుగాలై పరిణమించె

ఆ హవేలిలో ఆ నరకములో
ఆ మదనమదోన్మత్తుడు చేసిన
అత్యాచారపు దారుణ వివరము
లెన్నో యెన్నో ఏమని చెప్పుదు!

సామదానముల సాధింపలేక
కొట్టిన దెబ్బలు పెట్టిన బాధలు
తన్నిన తన్నులు పొడిచిన పోట్లు
ఎన్నో యెన్నో యేమని చెప్పుదు!
ఎంత బలాత్కృతి నెంత పశుత్వము
నెన్నివిధమ్ముల ప్రయోగించినా
ఏమాయెను?............

వినండి! వినండి! కులసతులారా!
వినండి! భారత గృహిణుల్లారా!
స్త్రీల కులానికి సిగ్గు ఘటించే
మగువల జాతికి మచ్చ ఘటించే
బలాత్కర్తలకు శిరస్సు వంచే
పిరికెగుండె కాదు కాదు లచ్చిమి!

ఏమాయెను ఏమాయెను తదుపరి ?
ఏమాయెను పదిగడియల తదుపరి ?

భాండారము లూటీ సేయుటకై
        బహుభంగుల యత్నించిన చోరుడు
ఫలములేక, కసితీరక, చివరకు
        తలుపుల గోడల నుమిసిన రీతిగ
అడుగడుగున కొరక తన్ను తన్నుతూ
ఆ నేలపైన పొరలాడించుచు
గుమ్మముదాకా యీడ్చుకు తెచ్చి
గూండాల దరికి జేర్చినాడు

సిగ్గు లేని ఆ జాగీర్దారుడు
చివరసారి యత్నము కాబోలును !
పడియున్న లచ్మి చెవిలో ఇట్లనె
        "ఇప్పటికైనా మించి పోలేదు
        పోలిగాడి జాడ నెరుగ వీవని
        బొంకుతావు ! శిక్షను తప్పిస్తా !

ఈ గూండాలకు లంచము లిస్తా
ఇండ్లకు పొండని పంపిస్తా
ఏ హానియు రాకుండా చూస్తా
ఇక నైనా తీర్చుము నాకోరిక !"

అలసి సొలసి పడియుంకిన లచ్చిమి
అల్లన కన్నులు తెరిచింది
ఆ కిరాతకుని అట్టే చూచి
కేకరించి ఉమిసింది నేలపై

రెండు వందలేండ్ల వయసు కలిగిన
రేగిచెట్టొకటి వుంది కోటలో
ఆ రేగును గూండాలకు చూపి
అన్నా డిట్లా జాగీర్దారుడు
"ఇదిగో లచ్చిమి ! అదుగో రేగు !
ఇక మీయిష్టం ! ఇక మీయిష్టం !"

రెక్కలు వెనక్కి విరిచారు
రేగిచెట్టుకే కట్టారు

చఢీల్ చఢీల్ మన కొరడా దెబ్బలు
కొడుతూ గూండా లరిచారు
"బోలో రండీ! బోలో జల్దీ!
పోలిగాణ్ణి యెక్కడ దాచావు?
నిజంచెప్పితే నిన్ను విడుస్తాం
లేదా ఈచెట్టుకు బలియిస్తాం"

వందలు జనులకు నీడ లిచ్చాడు
వంతలు జనులకు ఫలము లిచ్చాడు
వేలపక్షులకు వసతు లిచ్చాడు
విశాలహృదయుడు పరోపకారుడు
రెండువందలేండ్ల దొడ్డ మా ముసలి—
దుండగీండ్ర దుష్కృతి ఫలితముగా
నిండుప్రాణి వెచ్చని నెత్తురుతో
మెండుకున్న తన మేనును గాంచి
వెలవెలబోతూ నిలువున నీరై
జలజల ఆకులు రాల్చాడు!

ఇంద్రియముల నంతర్ముఖ మొనర్చి
ఏకాగ్రత బ్రహ్మధ్యానములో
ఎండా వానా చీకటి వెలుతురు
ఏమీ యెరుగని యోగిని వలెనే,
పోలిగానిపై బుద్ధి లగించిన
లచ్మి కెరుకయా కొరడా దెబ్బలు!

అక్కడ ఆ సాంద్రారణ్యములో
ఆ కొండ కింద చీకటి గుహాలో
ఆ పోలిగాడి ధీర మానసము
అటమటించె ఆందోళనతో

బువ్వబుట్ట సంకన పెట్టుకోని
సిరునవ్వులు వలకబోసుకుంటూ
సందకాడనే వొచ్చే లచ్చిమి
సగము రేతిరైనా, రాలేదు!

చురచురతో కనుబొమ్మలు ముడిచి
బరిసె ఈటె బాకు కత్తి దాల్చి

ముతాను వెంబడిరమ్మని చెప్పి
ముందు బయలుదేరాడు పోలడు

"బోలోరండీ! బోలోజల్ది
పోలిగాణ్ణి యెక్కడ దాచావు?
నిజంచెప్పితే నిన్ను విడుస్తాం
లేదా యీ చెట్టుకు బలియిస్తాం!
అంటూ కూసే గూండాకూతలు
చఫీక్ చఫీల్మను కొరడా మోతలు
మారుమోగుతున్నాయి కోటలో

అంతలోన 'హారహాం' భయద ధ్వని—
మహోగ్రసింహ కిశోరధ్వనులను
మరిపించే పోలడి కంఠధ్వని—
మారుమోగింది కోట దశదిశల!

అదుట మానెను గూండాగుండెలు
చలనము వీడెను గూండాచేతులు
కొయ్యబారినవి గూండా ఒడళ్లు
గుట్టుగజారెను గూండా కొరడాల్!

బాకులు ఒకతల కత్తికి ఒకతల
బరిసెకు ఒకతల ఈటెకు ఒకతల
పండిపోయినట్టి తాటిపండ్లన
పడిదొర్లెను రేగు పాదసన్నిధి!

కొనవూపిరితో లచ్చిమి ప్రాణము
నిలచివుంది పోలయ్య కోసమై
'లక్ష్మి! లక్ష్మి!' యని అత డేడ్వగ
లలితకరమ్ముల అల్లన నిమురుతు
ఒక్కసారి కన్ను తెరిచి చూసి
ఒరిగింది ప్రియుని ఒడిలో లచ్చిమి!

అంతలోన ఆ జాగీర్దారుడు
ఆ సవ్వడి ఆలించాడు
పిస్తోలొక్కటి చేత పట్టుకొని
బిరబిర యచటికి వచ్చాడు

లచ్చిమిలేని జగత్తు శూన్యమై
పిచ్చివాని రీతి కూరుచుండిన

పోలిగాని, వెనుక నుండి ప్రేల్చెను
ఆ లుచ్ఛా జాగీరుదారుడు !

లచ్చిమిపై పోలిగాడు ఒరిగె !

ఏ రక్తము ఆ వీరలచ్మిదో
ఏ రక్తము ఆ పోలిగానిదో
ఎరుగబడని ఐక్యతతో ముగిసిరి
ఎంత ధన్యులా వీర దంపతులు !

అంతలోన ఆ నాయకుల ముఠా
ఇరవైయొక్కరు నాయకుల ముఠా
'హరహర' నాదము లుప్పతిల్లగా
అడుగిడె జాగీర్దారు కోటలో

చచ్చిన లచ్మిని చచ్చిన పోలని
గుచ్చియెత్తుకొనిరి కొందరు
గోడుగోడుమని ఘోషలు పెడుతూ
ఏడ్చినారు ఆ ముఠా అందరూ !

శోకము వీరముగా మారింది!
ఏక కంఠముగ ఇట్లరిచారు!
"పకడో! పకడో! జాగీర్దారోఁ!
మారో! మారో! జాగీర్దారోఁ!

జాగీర్దారును పట్టి తెచ్చారు

రెక్కలు వెనక్కి విరిచారు
రేగిచెట్టుకే కట్టారు
ఏ కొరడాల్ వీరలచ్మి నెత్తురు
వీల్చి అలిసి నిద్రిస్తున్నాయో
ఆ కొరడాలని నిద్ర మేల్కొలిపి
అందుకున్నారు ఎరుక నాయకులు!

"బోలో లచ్చిమికీ జయ్ జయ్ జయ్!
బోలో పోలడికీ జయ్ జయ్ జయ్!"
అంటూ వినబడు ఎరుకల గీతము-
ఆ గీతమునకు తాళమో యనగ
వినబడు ఆ కొరడాల చఝీల్ ధ్వని-

తెలంగాణలో తొంభై లక్షల
తెలుగు హృదయాల మోర్మోగింది !

మంత్రగాడు కట్టు విప్పినంతనె
మైక ముడిగి తెలివి వచ్చినట్లుగ-
ఆ రేతిరి, ఆ మెరుక నాయకుల
అపూర్వ చర్యతో, మైకము తొలగి
తెలంగాణలో తొంభై లక్షల
తెలుగుల మదిలో వెలిగెను వెలుగు !

తొంభై లక్షల వాక్ కంఠములు
గంభీరముగా శ్రుతి మేళవించి
ఘోషించిన యా భీషణ శపథము
ప్రళయ మేఘ గర్జా ఘోషణమై
ప్రపంచ మెల్లడ ప్రతిధ్వనించెను
ప్రజాశత్రువుల ధైర్యము చెదిరెను
ప్రజాపీడకుల గుండెలు అదిరెను

"అధికార మదాంధుల క్షమియించం!
అన్యాయవర్తనుల సహియించం!
గూండాలకు ఇక జడువం! జడువం!
గులాములై ఇక ఉండం! ఉండం!
సలాము లిక మేం పెట్టం! పెట్టం!
పలికింది వినండి ప్రజావాణి!
బోలో! స్వతంత్ర భారత్కీ జయ్!
బోలో! త్రివర్ణ జెండాకీ జయ్!
బోలో! వీర తెలంగాణాకూ!
జయ్‌హో! జయ్‌హో! జయ్‌హో! జయ్‌హో!"







## ఎత్తండి జెండా! ★★★

ఎత్తండి ఎత్తండి
ఇండియా జెండా!
ఎత్తండి ఏకైక
ఇండియా జెండా!

అల హిమాద్రుల నుండి
అల్ల సేతువుదాక
ఎత్తండి ఇంటింట
ఏకైక జెండా!

మూడు రంగుల తోడ
మురిపించు జెండా
ధర్మచక్రం సదా
ధరియించు జెండా
హిందూ ముసల్మాన్లు
పార్శీలు క్రైస్తవుల్
కార్మికులు కర్షకులు
మజ్దూర్ కిసాన్లు
కోటి కంఠాలెత్తి
ఘోషించు జెండా !
కోటి ఖడ్గాలెత్తి
కొలిచేటి జెండా !

## నాయకుడు పంద్రంగి ★★★

(ఆంధ్ర రాష్ట్రం)

'హాగరీ' తటమ్ముప్పై ఆ రేగటిని పండు
బళ్లారి జొన్నలే బహుపుష్టికర మంట!
ఆ జొన్నలే తిని అతి శూరు డాయెనట
'హంపి' నేలినయట్టి ఆ కృష్ణరాయండు!
అహహా! ఆ జొన్నలు
ఆంధ్ర జొన్నలె సుమా!
కన్నడ జొన్నల
'శక్తి' లేదేమియు!
తలపోసి గర్వించవోయ్
జొన్నలను
తలపోసి గర్వించవోయ్
పంద్రంగి!
ఆంధ్రులకు సాటెవ్వరోయ్
పంద్రంగి!
ఆంధ్రులకు సాటెవ్వరోయ్!

ఆంధ్ర రాష్ట్రంబులో ఆ కొండవీటిలో
అల్ల గుంటూరులో ఆ నల్లచెర్వులో
పండేటి గోంగూర పటిమ గలిగిన దంట!
అది తినే ఆ 'తిక్క' భారతం వ్రాసినట!

ఆహాహా! ఆ గోంగూర
ఆంధ్ర గోంగూరయే!
అందులో సందియం
బావంతయున్ నహి!

పాడవోయ్ గోంగూరపై
పాటలను
పాడవోయ్ గోంగూరపై!
పంద్రంగి!
ఆంధ్రులకు సాటెవ్వరోయ్
పంద్రంగి!
ఆంధ్రులకు సాటెవ్వరోయ్!

ఏనుంగు దండులో 'ఇబ్రహీం షా' వచ్చి
కర్నూలు కోట నాక్రమణంబు చేయగా
ఊరి గాడ్దెల మేటి ఓండ్రమ్ములకు వాని
యేనుగులు పరువెత్తి యేటిలో పడెనంట !

అహహా ! ఆ గాడ్దెలు
ఆంధ్ర గాడ్దెలె సుమా !
నేటికిని ఆ ఏట
దీటుకొని ఓండ్రించు !

జోహారులిక చేయవోయ్
గాడ్దెలకు
జోహారు లిక చేయవోయ్ !
పండ్రంగి !
ఆంధ్రులకు సాటెవ్వరోయ్ ?
పండ్రంగి !
ఆంధ్రులకు సాటెవ్వరోయ్ !

గోదారి లంకలో 'కోటాకు' మన హక్కు
గునుపురపు సీమలో ముద్దపప్ మన హక్కు
ఆ కోనసీమలో ఆవకాయ్ మనహక్కు
అల కొండవీటి చేంతాళ్ళల్ల మనహక్కు

ఆహాహా ! అన్నిటికంటె
ఆ 'వారగోని'పై
అఖిల భారతములో
అన్ని హక్కులు మనవె !

హక్కులను విడనాడకోయ్
ప్రాచీన
హక్కులను విడనాడకోయ్
పంద్రంగి !
ఆంధ్రులకు సాటెవ్వరోయ్
పంద్రంగి !
ఆంధ్రులకు సాటెవ్వరోయ్ !

ఆంధ్ర జెండా బట్టి ఆడేవు శివమెక్కి
ఆంధ్ర మాంధ్రమ్మంచు కొట్టేవు చప్పట్లు
ఆంధ్ర రాష్ట్రింబంచు అరిచేవు చూరెక్కి
ఆంధ్ర రాష్ట్రింబంచు చరిచేవు తొడలను

అహాహా ! నీ ధాటికి
ఆ యింద్రు దులికిపడి
"ఆంధ్ర రాష్ట్రిపు పండు
నవనిపై ద్రొబ్బు" మని
కల్పవృక్షమునకు
కలినాజ్ఞ చేసెనట !

అందుకొని మా కివ్వవోయ్
ఆ పండు
అందుకొని మా కివ్వవోయ్ !
పంద్రడంగి !
ఆంధ్రులకు సాటివ్వరోయ్
పంద్రడంగి !
ఆంధ్రులకు సాటివ్వరోయ్ !



తురక గూండాల ముందర సలాములు పెట్టి
పారుబోతులనాన ఊరు ఖాళీ చేసి
పై గుడ్డ లేకుండ పారి వస్తేయేమి ?
"మనదే వరంగల్లు" ! "మనదే వరంగల్లు" !

అహహా ! కాదన్నచో
ఆ 'ప్రతాపుడు' సాక్షి !
అల్ల 'విద్యానాథు'
డంతకంటెను సాక్షి !

వెలికించి పిలిపించవోయ్
సాక్షులను
వెలికించి పిలిపించవోయ్ !
పంద్రంగి !
ఆంధ్రులకు సాటెవ్వరోయ్ !
పంద్రంగి !
ఆంధ్రులకు సాటెవ్వరోయ్ !

ఆంధ్ర మాంధ్రపతాక మాంధ్ర తేజమ్ము
ఆంధ్ర మాంధ్రత్వమ్ము ఆంధ్ర శౌర్యమ్ము
ఒక్కంత తలచితే
ఊహాలో జూచితే
ఒడలెల్ల ఉడుకదా !
ఉప్పొంగి పారదా !
లెండింక లెండింక
ఓ యాంధ్ర జనులార !
లేచి కూర్చున్నాడు
నాయకుడు పండ్రంగి !



## తెలుగునాటి శునకం ★★★

"కారదె వచ్చెను రంయ్ రంయ్
హారన్ కూసెను గుంయ్ గుంయ్
అప్పటికీ లేవవు! నీ ఆలోచనయేమో
తెలుపవె ఓ శునకా!
తెలుగునాటి శునకా!
నడిరస్తా పండుకొనే
మిడి మేలపు శునకా!"

"ఏ వాడకు పోయిందో నా ఆడది రాలేదు!
దాని రాక కెదురు చూస్తు దారిని పడుకున్నాను!
కారువాళ్లు గ్రహియించి, కాస్త తొలగి పోరాదా!"
బౌ బౌ బౌ! బౌ బౌ బౌ!



మన ప్రభుత్వ సంస్థ లన్నింటిలోకి

అధికార దుర్వినియోగం చెయ్యని
ఆడంబరం అట్టహాసం లేని
లంచగొండితనం ఎరుగని
ప్రజలను పీడించుకు తినని

ఏకైక ప్రజాసేవక సంస్థ
మన
తపాలా సంస్థకు
అంకితం

44

## పోస్టు జవాన్ ★★★

ఎవ రాతడు ఎవ రాతడు
వీధి తలుపు కొడతాడు ?

నిలిచీ నిలవని కాకీ పాగా
చాలీ చాలని కాకీ లాగు
గుండీలూడిన కాకీ కోటు

ఒక చంకన పాతగొడుగు
ఒక చంకన తోలు సంచి

ఎవ రాతడు ఎవ రాతడు
వీధి తలుపు కొడతాడు ?

పోస్టు జవాన్ పోస్టు జవాన్
మనబస్తీ పోస్టుజవాన్
బహు మాంచి పోస్టుజవాన్

వానా యెండా వాగులు వరదలు
చెట్టూ పుట్టా చీకటి వెలుతురు
ఏమీ అడ్డవు ఏమీ అడ్డవు
ఎంతో ధీరుడు పోస్టుజవాన్

తోలు సంచిలో కొన్నుంటాయి
చేతిలోన మరి కొన్నుంటయ్
ఎక్కణ్ణుంచో యెక్కణ్ణుంచో
ఎన్నో వందలు ఎన్నో వేలు
పోస్టు జవానులు తెస్తారు!
కార్డ్లు కవర్లూ నాట్ పెయిడ్లూ
బుక్ పాకెట్లూ మనియార్డర్లూ
వీపీల్ బంగీలు రిజిష్టర్లూ

ఆడవుల సందున పల్లెల నుంచీ
అంతల పొంతల సీమలనుంచీ
ఇంగ్లాండ్ నార్వే ఇటలీ నుంచీ
ఇరాక్ తురాన్ ఇస్పహాన్ నుంచీ
పారిస్ బెర్లిన్ మాస్కో నుంచీ
టోక్యో శాన్‌ఫ్రాన్సిస్కో నుంచీ

కటకం పూరీ కంబంమెట్టు
కాశీ దూసీ కావలి తెట్టు
కడప కందనోల్ హైదరబాదా
కాకరపర్రూ ముస్తాబాదా
యిశాగపట్టం యిజియనగరం
సీపిరిపిల్లి సిమ్మాద్రీ
మంగళగిరి బందర్ బెజవాడా
అంగలకుదురూ గోవాడా

ఇంకాయింకా యెక్కణ్ణుంచో
ఎన్నో వందలు ఎన్నో వేలు

పోస్టుజవానులు తెస్తారు!
తెస్తారు! మన కిస్తారు!
కార్డ్లు కవర్లూ నాట్ పెయిడ్లూ
బుక్ పాకెట్లూ మనియార్డర్లూ
వీపీల్ బంగీలు రిజస్టర్లూ

ఉదయం తొమ్మిది కొట్టంగానే
ఉబుకుతుంది మా జవాను సంచి
ఒంటిగంట రెండింటికి సందున
ఖాళీ! ఖాళీ! జవానుసంచి

రంగం నుంచే వచ్చిందంట
రామయ్యమ్మకు మనియార్డర్!
మా యింటవతల పాకా లోపల
కాపర ముండే రామయ్యమ్మకు,
రంగ మెల్లి పనిపాటలు చేసే
రాముడు పంపిన మనియార్డర్!
కన్నతల్లిపై కనికర ముంచి
రాముడు పంపిన మనియార్డర్!

" 'కీర్తి చేసులైన చీయుత
గెడ్డం యెంకటరాములు బార్యా
రామయ్యమ్మ — బెజవాడ —
గోరీల్ దొడ్డికి పడమట సందు' —
వుందా గెడ్డం రామయ్యమ్మ ?
వచ్చిం దెదుగో మణియార్డర్ !
పది రూపాయల మణియార్డర్ !"

"యాడుండది ఆ రామయ్యమ్మ ?
మొగుడు సచ్చిండు మూడేల్ల కితం
కొడుకెల్లిం డల రంగం మోల్మీక
డాకటేరు సెంద్రం గారింట్లో
దాసీపని సేత్తుండాది
డాకటేరు బదిలీ యెల్లంగా
యెంబడి యెల్లింది రాజమండ్రం "

మనియార్డర్ చిరునామా మారి
మెయిలు బండిలో రైలుపెట్టెలో

గుట్టలు గుట్టలు ఉత్తరాలతో
బయలుదేరింది రాజమండ్రం

రైల్లో వుండే మెయిలు సార్టర్లు
రజాకు శర్మలు చలాకి మనుషుల్

ఏలూరు ఉత్తరాల్ ఏలూరి సంచిలో
నిడదవోలు ఉత్తరాల్ నిడదవోలు సంచిలో
రాజమండ్రి ఉత్తరాల్ రాజమండ్రి సంచిలో
ఏ వూరికి
ఆ వూరివి
కట్టచుట్టి
సంచి గట్టి
భద్రంగా
సీలువేసి
బట్వాడా చేశారు

మహారాజుగారి కవరు
దఫేదారుగారి కార్డు

మల్లావధాన్ల రిజిస్టర్
మాదిగ రాముడి నటపిటీ
మియ్యాసాహేబ్ వీపీ
మిస్టర్ జాకోబ్ పార్సెల్
బుజం బుజం రాసుకుంటు
పోరు పొక్కు లేకుండా
ఒకపాత్తున ఉండనేర్చి
వచ్చేశాయ్ రాజమండ్రి,
గెడ్డం రామయ్యమ్మకు
మనియార్డరుతో సహా !

రాజా లాగే వస్తున్నాడు
రాజమహేంద్రం పోస్టుజవాన్ !
సర్కారిచ్చిన దుసుల లోపం
చాలా వున్నది, నిజమే ! పాపం !
నిలిచీ నిలవని కాకీపాగా
చాలీచాలని కాకీ లాగు

గుండీ లూడిన కాకీ కోటు

అయితే యేం? అయితే యేం?

ఆ శాంతం! నవ్వు మొహం!

ఆ ఓపిక! ఉత్సాహం!

రాజా లాగే వస్తున్నాడు

రాజమహేంద్రం పోస్టు జవాన్!

"'గడ్డం రామయ్యమ్మ - కేరాఫ్—

డాక్టర్ చంద్రం, యం. బీ. బీ. యస్ -

జనరల్ ఆస్పత్రి - రాజమండ్రి'—

వున్నారా సార్ డాక్టరుగారు?"

"నో! నో! డాక్టర్ చంద్రంగారు

భద్రాచలంకి బదలాయింపై

సకుటుంబంగా వెళ్ళారు

సరిగా మొన్నటి ఏప్రిల్ ఆరు!"

పరిగెత్తిందోయ్ పరిగెత్తిందోయ్

భద్రాద్రికి ఆ మనియార్డర్

తామయ్యమ్మకు మనియార్డర్
చీమలు దూరని చిట్టడవుల్లో
కాకులు దూరని కారడవుల్లో
వాగులు దాటి వరదలు గడిచి
మెకాలు ఎలుగులు పులుగులు గడిచి
చేరిందోయ్ చేరిందోయ్
సీతారాముల భద్రాద్రి

భద్రాచలాన పోస్టు జవాన్
బాలయ్యంటే భారీ జవాన్ !
మొహాన నిండుగ పంగనామాలు
చెవులకు పోగులు చేతుల మురుగులు
వేళ్లకు నాలుగు వెండి ఉంగరాల్
కాళ్లకు నగిషీ కిర్రుచెప్పులు
నడుముకు పటకా
లాగుకు బొందు
కళ్లకు ముక్కద్దాల పసందు

కొత్త పెళ్లికొడుకు లాగ
కోరమీసములను దువ్వి
నడిబజారు లోన నిల్చి
నాజూకుగ దగ్గితే

పక్కింటి పయిడెమ్మ
మాడీపై మంగమ్మ
గుడిసెలో తులిశమ్మ
గుట్టపై గయిరెమ్మ
కిలకిలా నవ్వుతూ
పలకరిస్తారు—

"బాలయ్ మాఁవా! బాలయ్ మాఁవా!
సిరిపురం నుంచి సీటీ లేదా?"
"కవుతరం నుంచి కవి రొచ్చిందా?"
"శంతేరు నుంచి కార టుంకదా?"
"నటపిటి నేదా నొవడా నుంచి?"

“ ‘గడ్డం రామయ్యమ్మ - కేరాఫ్—
డాక్టర్ చంద్రం, యం. బీ. బీ. యస్—
ఏజన్సీ హెల్తాఫీసర్ -
పోస్టు భద్రాచలం ’—
వున్నారండీ డాక్టర్ గారు ? ”

“డాక్టర్ చంద్రంగారు
సైన్యంలో చేరారు
సకుటుంబ సమేతంగా
మొన్నటి మే పదహారు
కలకత్తా వెళ్లారు
అక్కడ శ్యాంబజారు
అరవై నంబరు డోరు ! ”

ఆకాశం అందుకునే
అందాల మేడలకు
బాంబులకూ బాకులకూ
బంగాలీ బాబులకూ

గడితేరిన గూండాలకు
అంతులేని హత్యలకూ
పేరొందిన కలకత్తా! అదుగో కలకత్తా!

అవిగవిగో ట్రాములు పోతున్నయ్!
అవిగో రెండంతస్తుల బస్సులు!
టాక్సీల్! రిక్షాల్! గుర్రపు సార్ట్లు!
ఏమి కిటకిటా! ఎంత హడావుడి?
ఎన్ని బజార్లు! ఎన్ని హోటళ్లు!
ఎన్ని సినీమాల్! ఎన్ని పార్కులు!
ఏమి జనం! ఎంతజనం!

అదిగదిగో ఒక ట్రాంబండి
ఆ వీధి మొగన ఆగింది!
అరుస్తున్నాడు కండక్టర్
"శ్యాంబజార్! శ్యాంబజార్!
ఉతరో! ఉతరో! శ్యాంబజార్!"

జనాబ్ అబ్దుల్ ఖాశింఖాన్
శ్యాంబజారుకు పోస్టు జవాన్.
సైకిల్ మీాదనె పోతున్నాడు
జనాబ్ అబ్దుల్ ఖాశింఖాన్.
బాంగ్లా అంగ్రేజీ హిందీ ఉర్దూ
చదవగలడు మన ఖాశింఖాన్

ముప్ఫయ్ మూడో నంబరు మేడ
మోహన్ బాబుకు కార్డులు మూడు:
నలభై నాల్గో నంబరు మేడ
నందాలాలుకు కవర్లు రెండు:
యాభై యేడో నంబరు మేడ
అంగూర్ బాలకు బంగిల్ మూడు:
యాభై యెనిమిది నంబరు మేడ
అఖ్తర్ జానుకు పార్సెల్ వకటి :

అరవై నంబరు చేరాడు
అల్లన తలుపులు కొట్టాడు,

జనాబ్ అబ్దుల్ ఖాశింఖాన్
శ్యాంబజారుకు పోస్టుజవాన్

టక్ ఒకటి ! టక్ రెండు !
గడియ లాగి
తలుపు తెరిచి
కుడి చేతిని
చీపురుతో
అడ్డంగా నిలబడ్డది
గెడ్డం రామయ్యమ్మ !
"ఓరు బావు ? ఓరు బావు ?
యీాది తలుపు కొడతావు ?"
"ఘుగ్మే హై క్యా డాక్టర్ సాహేబ్ ?"
"నీ బాసేంటో నాకేం వెరిక ?"
"బులావ్ డాక్టర్ సాహేబ్కో"
"బులావు నేదు పులావు నేదు
డాకటేరు ఇంకా రానేదు

అమ్మగోరు బిడ్డకు పాలిత్తున్నది
అత్తగోరు బువ్వొండుతున్నాది"
అదే సమయాన
డాక్టరుగారు
కారు దిగారు
వచ్చేశారు
"యస్ ! యస్ ! పోస్టుమాన్ ! ఎనీ లెటర్స్ ?
"జీహాఁ సర్కార్ ! ఏక్ మొనియార్డర్ !"
"మనియార్డర్ ?"
"రాంగూన్ సే"
"రంగూన్ సే ! ?"
" 'గాడ్ డ్యాం రామజోమ్మా -
కేరాఫ్ - డాక్టర్ చొంద్రం -
సాత్ నొంబర్ దర్వాజా
శ్యాం బాజార్ కొల్కొత్తా' "
"ఓ ! ఐ సీ ! ఏయ్ రామయ్యమ్మా !
నీకే వచ్చిందా మనియార్డర్ !

వేలుముద్ర నీ వెయ్యాలి!
సాక్షి సంతకం నే చెయ్యాలి!"—

రూడాది గడిచింది
ఎందుకో వచ్చింది
ఒకసారి బెజవాడ
మన రామయ్యమ్మ

"ఓ మల్లక్కా? ఓ గయిరక్కా!
యిన్నారోలే యీ సితరం!
మా రాముడు ఆ రంగం నుంచి
పదిరూపాయిలు సీటీ కడితే
రంగం నుంచి బెజివాడా
బెజివాడ నుంచి రాజమండ్రం
ఆడనుంచి బద్దరాసెలం
ఆడనుంచి మల్లీ కలకత్తా
యాడకిపోతే ఆడకె వచ్చె

యెంత పనోడే పోట్టుజవాన్ !

యెంత దొడ్డోడు !

యెంత మంచోడు !

యెంత సెరద !

యెంతోటి ఓపిక !”

పోస్టు జవాన్ మన పోస్టు జవాన్

కష్టం చేసే పోస్టుజవాన్

అతని కోరికలు తీరాలి !

అతడు చల్లగా ఉండాలి !



# మా స్వంత ప్రచురణములు



**శ్రీ కొప్పరపు సుబ్బారావు**

| | | | |
|---|---|---|---|
| శాస్త్ర దాస్యము | రు 1/8 | నేటినటుడు వగైరా | రు 1/4. |

**శ్రీ వేటుకూరు వెంకటనరసయ్య**

| | | | |
|---|---|---|---|
| త్రివేణి | రు 1/8 | క్షేత్రలక్ష్మి | రు 1/8. |
| ప్రేమాలోకం | 1/- | మగువ మాంచాల | 1/8. |
| సిద్ధాశ్రమం | 1/- | | |

—— త్వరలో ——

**శ్రీ మానికొండ సత్యనారాయణగారి**

'తిలక్ జీవితం' — 'ఆంగ్లరాజ్యము'

**శ్రీ డి. టి. రావుగారి**

'ఇంగ్లీషు - తెలుగు డిక్షనరీ' పునర్ముద్రణ

**శ్రీ కొప్పరపు సుబ్బారావుగారి**

'వసంతసేన' నాటకం -



— ది మోడరన్ పబ్లిషర్స్ - తెనాలి —

# నేటినటుడు వగైరా ★ ★ ★

(మూడు ఏకాంక నాటికలు)

రచయిత : కొప్పరపు సుబ్బారావు

వెల : ఒక రూపాయి పావలా          ది మోడరన్ పబ్లిషర్స్, తెనాలి

## ⊣ అ భి ప్రా యా లు ⊢

"మీరు వ్రాసిన 'నేటి నటుడు' ఉత్తమ నాటక రచనా విధానాన్ని సూచిస్తున్నది."
—టి. రాఘవ, బళ్ళారి.

"సుబ్బారావుగారి రచనలో - ఇచ్చిన సలహాల్లో - ఎంతో దూరదృష్టి, పరిణతా, ప్రతిభా కనబడుతున్నవి"
— ఆంధ్ర పత్రిక.

"సుబ్బారావు గారి కలం అనుభవం చేత ఇందులో సానదేరింది. ప్రదర్శింపబడినట్లయితే, ఈ మూడు నాటికలున్నూ సంఘానికి ఏదో రూపంలో కొరడా దెబ్బలవలె తగులక మానవు"
—ప్రజామిత్ర

"సుబ్బారావుగారు తెలుగుదేశంలో ప్రజామోదం పడసిన నాట్యకరచనలో సిద్ధహస్తుడు. ఆ నేర్పరితనమే ఈ నాటకాలలో కూడా కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది."
—ములుకోల

"This publication is of a high literary order. It is vigorous writing all through. The book is instructive as well as enjoyable"
—HINDU.

'These playlets are very well written and do great credit to the author who is out to expose social evils through his writings"
—SADHANA

The first 'The Present day Actor' is an interesting instructive bold and bright satire. The second 'Confession' is in high classical style reminiscent of the ancient Gupta period. The third 'The Robinhoods' an Opera, is the most telling satire ever written in Telugu, on the foibles of the present day on the economic inequilibrium of society"
—INDIAN EXPRESS

67

# MaNaSu Foundation

## check list

| | |
|---|---|
| Book Number | CP03 B 275 |
| Condition | |
| Front Cover | Yes |
| Back Cover | Yes |
| Blank Pages | CI, 62, 65 |
| Missing Pages | |
| Others | |
| Remarks | |